గులాబ్ సింగువచ్చి జోలె చూశాడు. కళ్లెర్ర జేసి యిద్దరి వంకా చూశాడు. అప్పటికే శిబిరాల నగరంలో దెబ్బలు తిన్న అనాథలంతా, చింతతో ఆకలిని మరిచేందుకనేమో యిక్కడచుట్టూ మూగారు. అందులో యింకా కొందరు ఏడుస్తూనే వున్నారు. మరికొందరు భయంతో వణికపోతూనే వున్నారు. పిల్లలు, చిక్కి బొమికెల గూళ్ళై, కాకి గొంతులతో భయవిహ్వలులై గులాబ్ సింగు వంక చూస్తున్నారు. మరొక క్షణంలో దుఃఖనగర వాసులంతా అక్కడే వున్నారు.

యల్లమంద పెదిమలు కదిలి ఏదో జవాబుకోసం వెతుక్కుంటున్నాయ్. మురుగేశణ కళ్ళు నేల మీదికి వాల్చాడు.

గులాబ్ సింగ్ కు అవమానం జరిగింది. ఎంత అవమానం—యీ మౌనం ? దయలేని లాఠీముందు, రక్షణలేని అనాథల నెందరినో మోది వాళ్ళ బొమికెలకు పదును బెట్టిన తన లాఠీముందు గూడా యీ బిచ్చపు ముండాకొడుకు లికెంత దర్జా? పలకరా ?

ఠపీమని యల్లమందకు ఒకటి వడ్డించాడు. యల్లమంద కదలకనే కళ్ళెత్తి చూశాడు. గుంపులోని బిచ్చగాళ్ళలో కొందరూ పెద్దకేకల్తో అక్కడే కూలబడ్డారు. కొద్దిమంది తప్పుకుపోయారు.

యల్లమంద బాధ కనుపడనీయలేదు. జాలిగా చూస్తున్న మురుగేశన్ వంకకు దృష్టి మరల్చాడు. మురుగేశుకు ధైర్యం చెప్పే దృష్టి అది. ఒక ఆత్మను వేరొకటి కదిల్చి అగ్ని రగుల్కొల్పే దృష్టి అది. ఒక పీడితహృదయంనుండి మరొక తాడిత హృదయానికి అర్థంలేని, వ్యక్తంగాని, మానవ సందేశాన్ని కొనిపోయే దృష్టి అది.

మురుగేసు ముఖంలోని భయం యిప్పుడు భయంకరంగా వంకర్లు తిరిగింది. నెత్తురు లేక ఆకలితోనే ఎర్రనైన నేత్రాల్లో నిప్పులు వేగిన విప్పుడు. ఒక్క త్రుటిలో అతని శరీరమంతా రౌద్రంతో బ్రహ్మాండమంతా తనుగా వుప్పొంగింది. మరు త్రుటిలో, గుండెలు విరుచుకు నిలబడివున్న గులాబ్ సింగు లాఠీని పైబడి మురుగేసు లాగుకున్నాడు.

యల్లమంద లంఘించి, సింగు జుట్టు లంకించుకొని కిందకు వంచాడు. మరి ఆలస్యం లేదు. మురుగేసు లాఠీ ఆ వంగిన నడుంమీద తాండవనృత్యం చేయసాగింది.

గుంపులో కొందరు బిచ్చగాళ్ళు అరిచారు. మరికొందరు "తన్నండి తన్నండి" అని కేకలు వేశారు. చాలామంది "పాపిష్టి ముండావాడు" అని దీవించారు. కొంచెం పుష్టివున్నవాళ్లు పొయ్యిరాళ్లు ఏరి పెద్దవాటిని పృథ్విమీద కూలిన పీడకుడు గులాబ్ సింగ్ మీద బలంగా కుమ్మారు. మూలిగి, సింగు దొర్లిగింతలు పెట్టి కదలక మెదలక దుమ్ములో దుమ్ముగా పడ్డాడు. చుట్టూ రక్తం చిన్న పెద్ద మడుగులు గా నిలిచింది.

మురుగేశ్ అందరివంకా చూసి—

"చూస్తారేంరా, పిచ్చముండా కొడుకుల్లారా" అని అరిచాడు.

బిచ్చగాళ్లందరూ భయపడ్డారు—తమనెక్కడ చంపుతాడోనని. కాని ఒక ముసలి బిచ్చగాడు రక్తంలోపడిన తన పేలికల తలపాగా కొరకు వంగగానే, మురుగేసు ఒక్కతన్ను తన్నాడు.

"ఇటు—తే" అన్నాడు కళ్ళెర్రతో. వాడు భయంతో వణికి రక్తంలో తడిసిన ఎర్రగుడ్డనిచ్చాడు.

మురుగేసు దాన్ని గులాబుసింగు లాఠీకర్రకు కట్టాడు. దాన్ని అక్కడే నిలబెట్టాడు.

"పదండి పదండి. మన బియ్యమంతా సేక్ కొట్లోవున్నై."

బిచ్చగాళ్ళంతా సేక్ కొట్టున్న పాతమేడ వైపు నడిచారు. మురుగేసు ముందుకెళ్ళి చూశాడు. భోగాలాల్ అప్పటికే పలాయనం చిత్తగించాడు.

కొంచెం వదులు గా వున్న బియ్యం బస్తాను పిచ్చి శక్తితో ముందుకులాగి మురుగేసు అందరికీ చూపి—

"తీసుకోండిరా" అని గద్దించాడు.

* * * *

నేను క్లబ్బునుంచి తిరిగి వచ్చేటప్పటికి బిచ్చగాళ్ళ జెండా చుట్టూ పోలీసులూ మేజస్ట్రీటులూ కనిపించారు.

# దైవానుకూల్యములేని వివాహములు



## శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు

బాల్యవివాహ నిషేధశాసనమువలన నేమి, ఆధునిక మహిళా విద్యావిధానమువలన నేమి, ప్రౌఢావివాహములు వాడుకలోనికి వచ్చిన తరువాత, మనదేశములో నాగరిక సంఘములయందు చిక్కు సమస్యలనేకములు బయలుదేరినవి. ప్రాచీనకాలపు బాల్యవివాహ సంప్రదాయమున కొన్ని చెడుగులుండిన వనుట వాస్తవము. ప్రౌఢావివాహముల మూలమున ఆలోపములు తగ్గినవి. స్త్రీలలో ఉన్నతవిద్యావ్యాప్తి ద్వారా విజ్ఞాన వికాసమునకు హెచ్చుగా ఇపుడవకాశ మేర్పడినది; వరనిర్ణయ విషయమున కన్యకల తీర్మానమునకు విలువ వచ్చినది; కన్యాశుల్కపు దురాచారము అడుగంటినది; బాల విధవలసంఖ్య తగ్గిపోయినది. ఇవన్నియు సంఘాభ్యుదయ సూచకములగు సౌకర్యములే. కాని, వేరురకపు ఇబ్బందులు కొన్ని తల చూపుచుండుటమాత్రము కాదనజాలము.

ఇరువదిఏండ్ల క్రింద మన మూహించియుండలేని నూతన సమస్యలిపుడు మనల నెదుర్కొనుచున్నవి. విద్యావతులగు యువతీమణులను చేపట్టుటకు అర్హులగు వరులు కానవచ్చుట కష్టముగా ఏర్పడినది. కానవచ్చినా, భార్యను తగినరీతి పోషించగలమను ధైర్యముగల వరులు దొరకుటలేదు. దొరకినచో, వారిదృష్టి ఆకాశమార్గమునుండి భూమికిదిగియే రాదు. దిగనేని, అర్హమగురీతి, అరణ మిచ్చినవారిని గౌరవించి తృప్తిపరచుట కానిపని. ఇక, ఇప్పటి యువకులో? వారిది 'మురారి' మార్గము! వారపు భోజనములతో వ్యాసంగము జరుగుచున్న వారైనా, కోరునది లక్షాధికారుల పుత్రికలనే. అట్టి కన్యలను కట్టుకొన్నచో, వారి దృష్టిలో తాము గడ్డిపోచవలె అయినా చేయరని ఊహించునంత ప్రాపంచిక విజ్ఞానము వారికిలేదు. ఇంతేకాదు. 'బాహుక' పాత్రమునకు తగినవారైన నేమి, వారికి కావలసిన కన్యక రంభయే. ఎందరిముందు నాట్యమాడినా, కడకు రంభ నలకూబరుని వెదకుకొనియే పోగలదనుట వారికి వివేకమునకు గోచరించదు. విద్య పూర్తికాలేదని కొన్నాళ్లు, ఇంతలోనే ఏమి ఆత్రమని కొన్నాళ్లు, తగినవరుడు కానరాడని కొన్నాళ్ళు, అనుకొనుచుండగానే, కన్యకలకు పాతిక సంవత్సరముల ప్రాయము వచ్చుచున్నది. ఉన్నతపరీక్ష కానిమ్మని, ఉద్యోగము దొరకలేదని, భార్యను పోషించుశక్తి రానిమ్మని, తగిన కన్యక నిచ్చువారెవరూ రాలేదని, ఊహించుచుండగానే వరులకు 'చత్వారి' వయసు దాదాపుగా దాపురమగును. ఇట్టి పరిస్థితులలో వయసుమీరిన యువతులు యువకులు, అవివాహితులుగనే సంఘములో అల్లాడుచుండుట నేటికాలపు లక్షణము.

మనదేశమున ప్రజాబాహుళ్యము తగ్గుటకు ఇదియొక మంచి ఉపాయమే అయినదని సంతోషించు రాజనీతి విశారదు లుండకపోరు. మంచిదే. కాని, బ్రహ్మచర్యమును సాధించుశక్తి యున్నప్పుడే ఈ అవివాహిత కన్యా వర సముదాయము సంఘమునకు హితకారి. ఇప్పటిస్థితిలో సంతాన నిరోధకములగు కృత్రిమోపాయములను అభ్యసించుటకై కావలసినంత సదుపాయ సంపత్తి కలదుకాని, బ్రహ్మచర్యమును సాధించి, ఆరోగ్యమును, మనశ్శక్తిని, అభివృద్ధి పరచుకొనుటకు వలయు ఉపదేశములు, సాధనములు, లభించుట కష్టము. వయసుమీరి అవివా

హితులుగనున్న విద్యావంతులగు నేటి నాగరిక యువతీ యువకులలో అనేకుల ముఖములు కళలేని కన్నులతో, చివికిపోయిన చెక్కులతో, నిస్తేజస్కత చాటుచుండుట గమనించితిమేని, 'అయ్యో, పాప'మనిపించును. ఎన్ని సామానులు రాచినా, ఎంత ముఖమండన ద్రవ్యము ఉపయోగించినా, నానాటికి అలముకొని వచ్చుచున్న తేజోహానిని వారి చప్పిడి ముఖములు దాచుకొనజాలకున్నవి. మునుపటి కాలమున బాల వితంతువులు కొందరు గర్భవిచ్ఛిత్తి కార్యముల నలవాటు చేసుకొనవలసి యుండినది. కాని, ఇప్పుడు అవివాహితలలోనే కొందరు అట్టి ఘోరకృత్యముల పాల్పడుటకు అవకాశములు హెచ్చుగా ఏర్పడియున్నవి. ఇది మిక్కిలి విషాదకరమగు పరిణామము. దొడ్డివాకిలి తెరచి దయ్యమును పారద్రోలగా, అది తల వాకిటనే ప్రవేశించి ఇల్లు చేరుకొన్నట్లయినది.

అది యట్లుండె. ఈ యువతీ యువకుల వివాహములలో నొక విశేష మున్నది. ఒక్కొక్కరి దేహ మనోధర్మము లొక్కొక తీరు. లోకము భిన్నరుచి. వివాహము అయినప్పుడే కానిమ్మని, ఓపిక పట్టి, అదృష్టమునే నమ్ముకొని, ఊరక కూర్చుండుట అందరికిని సాధ్యము కాదు. ఇప్పటి నాగరిక జీవిత పరిస్థితులు అట్టి మనశ్శాంతికి చోటిచ్చునవి కావు. వెండితెరలపై సర్వసాధారణముగా కానవచ్చు రోజారంగుల వలపు కథలు, రేడియోలద్వారా చెవులు గింగురుగొట్టుచున్న ప్రేమపాటలు, కోరినచోట చేతికి లభించు పచ్చి శృంగారపు కథల మాసపత్రికలు, సంతకూటములలో, రైలుస్టేషనులలో విచ్చలవిడిగా అమ్మబడు చౌకరకపు అసభ్య చిత్రముల కళాశాస్త్రగ్రంథములు, మున్నగు పరికరము లెన్నియో భావోద్రేక జనకములై తప్పించుకొనుటకు వీలులేని స్థితిలో నున్నవి. అనాఘ్రాత పుష్పములవలె, ప్రపంచపు తీరుతెన్నులు తెలియని అమాయికలగు ముగ్ధలకు, విద్యకై పెద్దలకు దూరమందుండి వివేకహీనుల సహవాసమున వినోద కాలక్షేపముల కలవాటు పడిన యువకులకును, ఈ సామగ్రి ఎంత ప్రమాదకారియో, ప్రపంచ తత్త్వవేత్తలకు విన్నవించుట అధిక ప్రసంగమగును.

“నా కిప్పుడే వివాహమున కేమి ఆత్రము ?” అని కొన నాలుకతో అనుచుండగనే, కన్యకలకు క్రమక్రమముగా లోలోపల తీయని భావములు పెరుగుచుండును. ఉషాపరిణయకథ స్వప్నములలో వారికి కానరాగలదు. వయః ప్రయుక్తముగా వారి మనోధర్మములలో ఇట్టి మార్పువచ్చుట సహజము. ఇట్టి కాలములో వారి జాతకములలోని శుక్రునికి ఉత్తేజనమునిచ్చు చలితదశలు వచ్చెనా, ఇక చెప్పవలసినదే యుండదు. ఇట్టి పరిస్థితులలోనే యువతీ యువకులు, ఆకస్మికముగా, ఒకరినొకరు చూచుకొనుటయు, వెంటనే వారికి పరస్పర స్నేహబంధమేర్పడుటయు, ముందు వెనుకలు పరికించక తోడనే వారు వివాహమగుటయు, అనేక సందర్భములలో జరుగుచున్న కథ.

'మంచిదే, కన్యా జనకులకు కష్టమేతప్పినది.' అనవచ్చును. సత్యమే. కాని, ఇట్టి ఆకస్మిక ప్రబలాకర్షణమువలన సంఘటించిన దాంపత్యములలో అనేకములు త్వరలోనే విషాదాంత నాటకములుగా పరిణమించుచుండుట మాత్రము చింతాకరము. చలితజాతకములో వచ్చిన ఉత్తేజనము దుష్టమయినప్పుడు ఇట్టి ఆకర్షణము వలన కల్గిన సంబంధములు దుష్ఫలములనే ఈయగలవు. ఇట్టి కథానాయికలలో కొందరు కర్మ ఇట్లు కాలినదనియో, దైవమిట్లు చేసెననియో, అనుకొనుచు ఆ జన్మాంతము కాయిక మానసిక క్లేశముల పాలై నవయుచున్నారు; మరి కొందరు తెగత్రెంపులు చేసుకొని దేహత్యాగమునకో, శీలత్యాగమునకో, సిద్ధపడుచున్నారు; వేరు కొందరు ధైర్యమవలంబించి. న్యాయస్థానమున కెక్కి వివాహవిచ్ఛేదమును సంపాదించుకొని మరల 'గంతకు తగిన బొంత'కై తారాడుచున్నారు.

చెప్పవచ్చినదేమన, భావోద్రేకముగల వయస్సులో ప్రబలాకర్షణము సంభవించినపుడు ప్రమదలకు వివేచనా శక్తిశూన్యమగుటచే ప్రమాదముల పాలగుదురనుట ! తాము కర్షించిన వ్యక్తికి తమతో అతుకగల యోగ్యతయున్నదా, లేదా అని పరిశీలించుటకు వలయునట్టి 'ఓపిక' కాని, అవకాశముకాని, వారికి ఆ సందర్భములో నుండదు. అందము, ఆర్జన, విద్య, ఇవే ప్రధానముగా వారికి గోచరించు సమస్యలు. ఇవి కొంత తృప్తికరముగా చూపట్టినచో చాలు. పెండ్లి పీటలమీద

కూర్చుండి ధన్యులమయితిమని వారు భావింతురు. కాని, సంసార రంగమున కాలుపెట్టిన కొన్నినాళ్ళకే తాము చేసినది తెలివితక్కువపని యని స్వానుభవమువలన వారికి బోధపడుచున్నది. అందమునకు భ్రమసి ఆడంగిని సంపాదించుకొన్న సుందరులు కొందరు, వన్నెను మోహించి వంధ్యాత్వము నార్జించిన కాముకులు కొందరు, విద్యను నమ్ముకొని వివేకహీనుని కట్టుకొన్న బుద్ధిమతులు కొందరు, ధనము నాశించి దయాదాక్షిణ్య రహితుల పాలైన భాగ్యవతులు కొందరు, ఇట్లే పలువురు పలువిధములుగ దుఃఖించుచున్నారు. ఇక అత్తగారి పోరుతో, ఆడుబిడ్డల దౌరాత్మ్యముతో, సందుగొందుల సవతుల కుట్రలతో, భర్త అభిమానమును పోగొట్టుకొని, అనారోగ్యమును సంపాదించుకొని, అనలేక అనుభవించలేక, కుములుచున్న పడుచుల అవస్థ చూచి భరించుట కష్టము.

కాని, ఒక సందేహము రావచ్చును. "అత్యంత హృదయంగమముగా ప్రారంభించిన పరస్పరాకర్షణమునకు ఇదియేనా పరిణామము ? అతకని వ్యక్తులకు అంత ఆకర్షణమేల ?" అనవచ్చును. అదే దైవ చిత్రము. ఎగిరిపడుచున్న శలభములను అగ్నిజ్వాల ఆకర్షించనేల ?

పూతమెరుంగు తళుకుబెళుకులవలన కలిగిన భ్రమయే ఇట్టి దంపతులను ఆకర్షించినది. దానిని ప్రేమయో, అనురాగమో, అనుకొనుటే ప్రథమమున వారు చేసిన పొరబాటు. రెండు జీవితములను ఒకటిగా చేయవలసినది వివాహము. వివాహానంతరము ఆ ఫలము సిద్ధించనినాడు భార్య 'భిన్నాంగి' యగును కాని 'అర్ధాంగి' కానేరదు. కాయికముగా, మానసికముగా, వారి స్వభావములకు ఐక్యత సిద్ధించనిచో, అట్టి బంధముకంటే నరకవాసమే వారికి మేలు. కంటికి ఆకర్షణము కలిగినంతమాత్రాన, సర్వము సమీచీనముగా ఉండగలదనుకొనుట మహాసాహసము.

కావుననే, దైవానుకూల్యముగల కాలమున, అట్టి అనుకూల్యమును సూచించు వ్యక్తితోనే, వివాహము కావలయునని లోకహితైషులగు ప్రాచీన మహర్షులు శాసించిరి. ఈ సూత్రము లీకాలమున, 'చేదస్తపు' వ్రాతలుగా విద్యావంతుల దృష్టిలో కానవచ్చుచుండుట విషాదహేతువు.

ఒక్క మనవి. స్త్రీవిద్యాభివృద్ధిని కాని, ప్రౌఢావివాహ సంప్రదాయమును కాని, నేను ద్వేషించుచుంటినని పాఠకమహాశయులు భావించరాదు. గంగానదిలోని జలము పవిత్రమైనా, అందలి మొసళ్ళ వాతబడకుండ తప్పించుకొనుట హితము కాదా? అట్లే, ప్రశంసలోనున్న సంప్రదాయము లాభకరమైనా, దానిలోనున్న సుడిగుండాలనుండి తప్పించు మార్గములను నిరాకరించుట భావ్యము కాదు. ఆలోచించి చూడుడు.

పోనిండు. ఒకటి రెండు దృష్టాంతములు—దైవప్రాతికూల్యమువలన క్లేశపాత్రము లయినవానిని—చూపుట ప్రయోజనకారి.

ఉన్నత విద్యావతియగు ఒకానొక నాగరిక కన్యారత్నపు సాయన జాతకచక్ర మీ క్రింద నున్నది.

| | | | |
|---|---|---|---|
| బు 28-22<br>రా 5-22 | వ 23-27<br>శు 23-32<br>ర 25-7 | | |
| శ 15-0 | సాయన | | |
| చ 4-0 | గ్రహభావకుండలి<br>I | | X 2-16 |
| | I 3-18 | | కు 0-56<br>కే 5-22<br>ఇ 7-41<br>గు 14-14 |

అందచందములు, తీక్ష్ణస్వభావము, ధైర్యసాహసములు, కార్యదీక్ష, మున్నగు గుణములకు పేరైన వృశ్చికము లగ్నము. సప్తమభావమందున్న శుక్రుని దృష్టి ఈ లగ్నముపైన కలదు. జాతకురాలు మంచి సౌందర్యవతియగుట విశేషము కాదు. లగ్నముపైనున్న రవిదృష్టి ఆమె సౌందర్యమున కొక గాంభీర్యమును, రాజసమును తెచ్చిఇచ్చినది. ప్రతిభాయుతమైన వర్చస్సు, గౌరవాస్పదమగు ముఖభావము, లగ్నముపైగల వరుణ గ్రహపుదృష్టి ఫలము. కుజ

చంద్రుల పరస్పర త్రికోణదృష్టి గరుభతనముతోటి భావతీక్ష్ణతను, కొంత కోపప్రకృతిని, తెలుప జాలినది. మూడింటి చంద్రుడు చక్కని విజ్ఞానమునిచ్చి విద్యావతి యీమెయని చాటుచున్నాడు. స్వక్షేత్ర బలముగల చతుర్థాధిపతి శనిపుట్టిన ఇంటియోగ్యతకు సాక్షి. ధనపంచమాధిపతి యగుటచే యోగకారకుడైన బృహస్పతి లాభస్థానములో, విద్యలకు ఖ్యాతిగాంచిన కన్యారాశి 14 భాగలో, ఉండుట జాతకురాలి సుకృతము. ఉత్తమవిద్య దీని ఫలము.

ఇక సప్తమభావమును చూడుడు. అతిరథ మహారథులగు రవి వరుణుల సహవాసముతో సప్తమాధిపతియగు శుక్రుడు సప్తమభావమందే కలడు. విశేషమేమనగా, ఈ శుక్రుని కొకవైపున రవియు, మరియొకవైపున వరుణుడు నిలచియుండుటె. సహజమైన శృంగార రసమునకు వీరరసము తోడైనది. వైవాహిక జీవితముపట్ల ధైర్యము, ప్రాగల్భ్యము, స్వాతంత్ర్యప్రీతి, ఆత్మాభిమానము, ఈమెకు అభిమానపాత్రములైన మనోధర్మములని అర్థము. ఇట్టి శుక్రుడుండుట స్వక్షేత్రమగు వృషభములో కాదు, కుజుని రాశియగు మేషమందే. తన్ననువర్తించువాడే భర్తగా నుండనర్హుడని ఈమె సంకల్పము. ఇవన్నియు బాగుగనే యున్నవి. కాని, వరుణశుక్రులనుండి సార్ధకేంద్ర ప్రాతికూల్య దృష్టిలో కేతువుతో చేరియున్న మాయలమారి ఇంద్రగ్రహముతోడి సంయోగమునే లగ్నాధిపతి కుజుడు అభిలషించుచున్నాడనుట చింతాకరము. శుక్రుని కోరికలు కొనసాగుట కష్టమనియు, ఆగ్రహము సూచించు స్వభావమువలన జాతకురాలికి ప్రాపంచికముగా క్లేశమేఫల మగుననియు, సూచన. ఆదర్శములు మృగతృష్ణాప్రాయములనియు, వాస్తవమును కనుగొనలేక ఈమె ఆత్మవంచనము పాలై ఖేదపడగలదనియు, ఈ యోగము తెలుపజాలినది.

జాతకురాలికి వ్యాసంగము ముగియకమునుపే, ఉన్నత విద్యావంతుడై, గౌరవార్హమగు వృత్తిగలిగి, అవివాహితుడుగనున్న యువకుడొకడు దూరదేశములో నున్నాడని పెద్దలు విన్నారు. తారుణ్య విజృంభణమును చూపుచున్న జాతకురాలికి వివాహము సాగించు కోర్కె పెద్దలకు వచ్చుట అస్వాభావికము కాదు. రూపసియగు విద్యావంతుడు వరుడు; విద్యావంతురాలగు సుందరి తమకన్య. ఇంకేమి కావలయును? ఒక్కసారి వరుని చూడగనే పెద్దలు తృప్తిపడినారు. విద్యావ్యాసంగమునకు విఘాతము కల్గదేని, పెద్దల ఇష్టప్రకారము పెండ్లియాడుటకు జాతకురాలికి ఆక్షేపము కానరాలేదు. కన్యావరుల పరస్పర దర్శనమొక్కటి కావలయును కదా?

పంచాంగశుద్ధినయినా గమనించక, దుష్టవార, దుష్ట, యోగములగల ఒకదినమున, హుటాహుటిగా జాతకురాలిని పిలుచుకొనిపోయి, ఆనాటి 'త్యాజ్య' కాలపు గడియలలోనే, ఆ శాస్త్రమును ముగించినారు పెద్దలు! ప్రథమదర్శన క్షణమందే కన్యావరులకు పరస్పరానురూప్యము గోచరించినది. వ్యాసంగమునకు ప్రతిబంధకము లేదుకదాయని జాతకురాలు భావిభర్తను ప్రశ్నింపగా, ఎంతదూరము వ్యాసంగము చేయదలచినా నిరాక్షేపముని నిశ్శంకోచముగా అతడు ప్రతి ఇచ్చినాడు. తత్క్షణమే వివాహము నిర్ధరించుకొని వెంటనే స్వగ్రామమునకు బయలుదేరి జాతకురాలు మరల తన వ్యాసంగధోరణిలో బడినది. విద్యకు భంగము గానీయక కొన్ని నెలలలో జాతకురాలికి వివాహము జరిపినారు పెద్దలు. ఏ మహానుభావుడో కాని, శనిచంద్రసంయోగమున్న దినమునందే వీరి వివాహమునకు లగ్నము నేర్పరిచి ఇచ్చి పుణ్యము కట్టుకొన్నాడు. యథాసావకాశముగా పరీక్షల తరువాత జాతకురాలు భర్తృగృహమును చేరుకొన్నది అచటనే వ్యాసంగమును కొనసాగించవచ్చునని ఆమెకు ఆశ. కాని, ఆ కళాశాలలో నేర్వవలసిన విద్య వేరని ఆమెకు తోచినదికాదు.

జాతకురాలి చలితశుక్రుడు కుజుని త్రికోణ దృష్టితో వృషభరాశిని ప్రవేశించి క్రమక్రమముగా ఇంద్రుని ప్రత్యక్ష స్నేహదృష్టిసౌకర్యమును సంపాదించుకొన్నాడు. భావి జీవితమునుగూర్చి మేఘమండలములో నిర్మించిన రంగు రంగుల ఆవిరి మేడలలో మెరుపుతీగల ఉయ్యాల ఊగించు ఆనందయోగమిది. అందరాని ఆదర్శములు, అలవి గాని ఆశలు, దినదినాభివృద్ధినొంది హృదయము నుద్రూత లూగించినవి. పట్టినదెల్ల బంగారమై చూపట్టసాగెను. ఇట్టిపరిస్థితులలో నిశ్శంకముగా ప్రయాణము చేయుచున్న శుక్రుని మార్గమును కొన్నేండ్లలోనే జన్మశనిని

కేంద్రవేధచే అరికట్టి, ఉచ్ఛృంఖలములగు ఆశలు, అభిప్రాయములు ప్రాపంచికముగా పనికిరావని హెచ్చరించినాడు. కాని, ఈ సూచనను ఈ నాగరిక జీవితములో గమనించువారెవరు? పెద్దలు జాతకురాలికి వివాహప్రయత్నము చేసినది ఈకాలమందే. సంకుచితదృష్టిగల పెద్దల అవిచారపరత శని వేధాఫలములలో నొకటి. వరుని స్వభావమెట్టిదో, అతని లక్ష్యము లెట్టివో, అతని చిత్తవృత్తితో సామరస్యము సంపాదించుకొను శక్తిజాతకురాలికి కలదా, ఇత్యాది విషయములను పెద్దలు గమనించనేలేదు; కడకు, వరుని ఇంటిపేరు సయితము విచారించినవారు కారట! అట్లే వివాహము జరిగినది.

స్వకర్వనిర్వహణమే పరమాదర్శముగా గల గ్రహము శని. గృహిణీకర్మమును నిర్లక్ష్యము చేయు వ్యాసంగము అతని దృష్టిలో అకర్మము. వ్యాసంగమునకు తగినది బ్రహ్మచర్యము కాని వివాహము కాదు. కాని, రవివరుణుల సహవాసములో పుట్టి, ఇంద్రకుజుల యాజమాన్యములో పెరిగిన జాతకురాలి యొక్క శుక్రుని దృష్టి వేరు. వివాహము కానిమ్మని శని వేచినాడు. అయినది.

తరువాతి కథ వేరు. జాతకురాలికి ఆరోగ్యము చెడుటతో శని తన పని ఆరంభించినాడు. పరీక్షలో పూర్తిగా విజయము వచ్చునప్పటికి ఆరోగ్యము సగమైనది. అత్తవారింటిలో అడుగుబెట్టు వేళకు వాస్తవముగా ఆమె 'అర్ధాంగి' రసపిపాసియగు విద్యావంతుడు భర్త. అతనికి లభించినది భార్యానీరసము. అచిరకాలమందే వారి భావ వికాసము చల్లబడి హృదయములు ముకుళించినవి. ప్రబలకారణ మేమియు లేకనే, ఒకరిమనుస్సు నొకరు నొప్పించినారు వారు. విద్యయున్నది కాని, భర్తకు వివేకము మట్టము, అనుభావము భార్యకు, చదువుకొన్నదే కాని, భార్యకు సహృదయత్వము లేదను అభిప్రాయము భర్తకు, వచ్చు పరిస్థితు లేర్పడినవి. అడుగడుగునకు వారి హృదయములు పరస్పరముగా దూరమగునట్లుగా శని పన్నుగడపన్నినాడు. పెండ్లిచేసుకొని సంపాదించుచున్న భాగ్యమింతేనా యని భర్త మనస్సు అశాంతిపాలయినది. పుట్టినింటిలో హాయిగా నుండక అనారోగ్యస్థితిలో దయలేనిచోట అల్లాడవలసిన వ్రాత ఇది ఏమని భార్య నొచ్చుకొన్నది. తప్పుచేసితివని భర్త, పొరబాటైనదని భార్య, అంతా కర్మయని పెద్దలు, చింతపాలగుటే ఇప్పటికీ వివాహపు ఫలము. ఈ దంపతుల రూపము, విద్య, విజ్ఞానము అడవిని కాచిన వెన్నెలఅయినది.

చలితశుక్రుడు ఎంతకాలము శని వేధలో నుండగలడు? ఎట్లో కష్టపడి ఏడాదికడపినచో, తరువాత శనిబాధ లేదుకదా? అందురేమో? వాస్తవమే. కాని, వైవాహిక సుఖసౌభాగ్యకారకుడగు శుక్రుడు, అందులో జాతకురాలికి ఈ గ్రహము భర్తృస్థానాధిపతి—చెడిన వయస్సులో ప్రారంభమైన ఈ వైవాహిక జీవితము, తరువాతికాలములో శుక్రుడెంత బాగుపడినా, ఉండవలసినంత ఉత్సాహజనకముగా, ఆదర్శప్రాయముగా ఉండుట సామాన్యముగా సాధ్యముకాదు. ఇది ఇట్లుండ, జాతకురాలికి సప్తమ భావములో నున్నవాడు రవి. భర్తతోడి సామరస్యమునకు ఇది సయితము భంగకారియే. ఇట్టి రవి చలించి రెండేండ్లకు జన్మశనితో కేంద్రవేధపాలు కావలసియుండును. ఇది క్లిష్టకాలము. ఇది దాటువరకు ప్రమాదము పాలుకాకుండ కాపాడుకొనగల్గినచో, తరువాత వీరి వైవాహిక జీవితము బాగుపడుటకు అవకాశమున్నది. అట్టి సౌకర్యము భగవంతుడు వీరి కనుగ్రహించుగాక.

శని శుక్ర వేధకల దశలో పెండ్లియాడిన మరియొక తరుణి జాతకచక్రమిది చూడుడు—

| | | | |
|---|---|---|---|
| X 4-0 | రా 6-56<br>వ 18-24<br>(వ) | | I 12-45 |
| | సాయనగ్రహ<br>భావకుండలి | | |
| శ 16-41 | II | | గు 12-58 |
| | చ 11-9 | కే 5-56<br>శు 28-54 | ఇ 6-8<br>బు 6-2<br>ర 21-58<br>శు 28-55 |

మిథునము లగ్నము. రసపిపాస, వాక్చాతుర్యము, కళా కౌశల్యము, నిశితబుద్ధి, లగ్నమువలన

జాతకురాలు సంపాదించిన గుణములు. లగ్నాధిపతి బుధుడు ఉచ్చగతుడై చతుర్థకేంద్రమందున్నాడు. చక్కని తెలివితేటలు కలవు. అందమునకు పేరుగాంచిన సింహరాశి 13 వ భాగలో, చంద్రునినుండి దశమ కేంద్రమందు, ఉన్న గురువునుండి అర్థకోణ శుభదృష్టి లగ్నముపైన కలదు. మంచి సౌశీల్యము, లావణ్యము, కల సుందరి యామె. ఇంద్రబుధుల సంయోగముపైన చంద్రుని మిత్రదృష్టియున్నది. చక్కని సౌకుమార్యము, కోమలహృదయము, మధురమైన వాక్కు, మంచి ఊహలు, ఇవి ఈ యోగపుఫలము. ఇంద్రశుక్రులును, బుధునుసహా, బుధక్షేత్రమందుండుట కారణమున జాతకురాలికి గాంధర్వకళ ఉగ్గుపాలతో వచ్చినది. స్వక్షేత్రమందున్న చతుర్థాధిపతి బుధుడు ఆభిజాత్యపు అభిమానము నిచ్చినాడు. పురుషార్థ సాధనమునకు వలయు ఆసక్తి, పాటవము, చాకచక్యము, ఉపజ్ఞ. సమృద్ధిగా నున్నవని మేషరాశి 18 వ భాగలో నుండు వరుణుడు తెలుపుచున్నాడు. రవి శుక్రులపై శనికిగల స్నేహదృష్టి శీలమునకు గొప్ప విలువకలదు. స్వాతంత్ర్య ప్రతిపాలన విషయమున జలగల మకరరాశి 16 వ భాగలోనున్న శని జాతకురాలి మనస్తత్వ మెట్టిదో తెలుపగలడు.

సప్తమ భావములో గ్రహములులేవు. సప్తమాధిపతి గురువు సింహరాశిలో నుండి వరుణుని కోణ దృష్టిని పొందినాడు. సాధువర్తనము, సత్స్వభావము, రసజ్ఞత, స్వాభిమానముకల వ్యక్తి భర్తయగునని సూచన. కొంత మురారి మార్గము సయితము అతనిలో పొడగట్టవచ్చును. ఆ గురువుపై ఆరింటి చంద్రుని కేంద్రదృష్టి ఆర్థిక క్లేశముగల ఉదారి అతడని తెలుపగలదు. సప్తమాధిపతి మూడింటనుండుటచే భర్తగారి బంధువులనుండి జాతకురాలు దుఃఖమనుభవించవలసి యుండును. అది యట్లుండె.

నవయౌవనారంభమందే జాతకురాలిని పరిణయమాడుటకై కొందరు యువకులు కుతూహలము చూపిరి. కాని, విద్యచాలదని, ఆర్జన తక్కువయని, అత్తమామల పోరని, ఏదో ఒక కారణముతో, ఆ సంబంధములు జాతకురాలి తండ్రికి వచ్చినవి కావు. వచ్చినవరులకు తగిన ఆర్థిక సౌకర్యమూ, అతనికి లేదు. పైగా, అతనికి సంగీతపుపిచ్చి. గాంధర్వ విద్యపై అభిమానములేని వ్యక్తి అల్లుడైనచో, కూతురుయొక్క కళా కోమలహృదయము వికాసము దక్కదని అతని నమ్మకము.

శుక్రుడు చలితజాతకమున తులారాశిలో పంచమ భావమందు సంచరించుచు, భర్తృస్థానాధిపతియగు బృహస్పతితో మిత్రదృష్టికి వచ్చినాడు. వివాహమున కిది మిగుల రమ్యమైన కాలమని వేరుగా చెప్పవలయునా ? ఆ కాలములో వివాహము నడచియుండెనేని, జాతకురాలికి జీవితములో చక్కని శుభాశుభవము వచ్చియుండెడిది. కాని, చారవశమున ఇంద్రుడు చలితరవిమీదికి వచ్చుటయు, గురువు శనికి కేంద్రములో, ఇంద్రబుధులకు అర్థకేంద్రములో సంచరించుటయు ఆ కాలమందే సంభవించినది. అలవికాని కోరికలవలన ఎదిగిరానున్న సంబంధములు తప్పిపోయినవి. తండ్రియొక్క అవిచారపరతవలన అపుడు వివాహము కాలేదు.

కొన్నాళ్ళకు చలితశుక్రుడు తులారాశిలో 16 వ భాగకు వచ్చినాడు. చారవశమున ఇంద్రుడు సయితము చలితశుక్రుని ప్రక్కకు వచ్చుట అప్పుడే. మకర శనికి నిండు కేంద్రస్థానమది. ఇక మీ గొంతెమ్మకోరికలు కట్టిపెట్టుడని శనైశ్చరుడు వారిని కసరికొట్టినాడు. ఇట్టి దశాకాలములో ఆకస్మికముగా ఒక సంగీత విద్యానిపుణుడు జాతకురాలి కంటబడుట సంభవించినది. రాగమునకు తాళము జతపడినట్లయ్యెను. భర్తృస్థానాధిపతి యగు గురువు జన్మరాశిపైనున్న దినమది. శని భర్తను సిద్ధముచేసినాడు. కొన్ని సంవత్సరములుగా తల్లితండ్రులు వివాహప్రయత్నము చేయుచుండినా, వలదని నిరాకరించుచుండిన వ్యక్తి అతడు. చెప్పుకొనుటకు ఆర్థిక స్థితి బాగుగా లేదనుకారణము చాలుకదా ? కాని ఒక విశేషము. ప్రబలమగు రక్తియో, విరక్తియో, మరి ఏమికారణమో, తన్ను చేపట్టిన తరుణికి సుఖములేదని తన ఆప్తవర్గముతో అతడనుకొనేవాడట అయిననేమి, ప్రథమ సందర్శనమందే వీరిరువురికిని బంధమేర్పరచినాడు శని. అతని జాతకమున శనియే భార్యాస్థానాధిపతి !

మిసమిసలాడు పరిపూర్ణ తారుణ్యముతో పొంగారుచున్న ఆ సీమంతినిని చూచి భ్రమించి ఆ

"లక్స్ టాయ్‌లెట్ సబ్బు
నా ముఖమును మనోహరముగా నుంచును"

అని కన్నాంబ చెప్పుచున్నది




సినీమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు

LTS. 338-X30 TL

# హిందుస్తాన్ కో-ఆపరేటివ్
## ఇన్స్యూరెన్సు సొసైటీ లిమిటెడ్.
(హెడ్డాఫీసు—కలకత్తా)

నమ్మకమునకు, స్నేహపూర్వకమైన లావాదేవీలకు పేరొందిన కంపెనీ. గత 45 సం॥ ల ప్రజాసేవలో సొసైటీ సంపాదించిన గొప్ప ప్రజాదరణకు యీ అంకెలే ప్రబల తార్కాణము.

| | |
|---|---|
| 1951 లో పూర్తి చేసిన వ్యాపారం— రు. | 16,28,00,000 |
| 1951 లో అమలులో వున్న మొత్తం భీమా రు. | 81,00,00,000 పైగా |

ఆంధ్ర జిల్లాలలో సొసైటీ యేజంట్లుగా పనిచేయదలచి సమర్థత గౌరవముగలవారు విజయవాడలోని సొసైటీ బ్రాంచి ఆఫీసుకు వ్రాయగోరెదము.

**హిందుస్తాన్ బిల్డింగ్సు,**
పో. బా. నెం. 12, బకింగ్‌హాంపేట, పోస్టు,

**ఐ. కె. రాయ్,** బ్రాంచి మేనేజరు
విజయవాడ



లోకప్రసిద్ధిపొందిన

# పి. వి. రాజన్
## అండ్ కంపెనివారి




శ్రేష్ఠమైన మదరాసు నశ్యం

**R. S.** సుగంధ ముక్కుపొడి

అన్నిటిలో సాటిలేనిది.

ధర వివరములకు వ్రాయుడు.

తయారుచేయువారు:—

**పి. వి. రాజన్ & కంపెని,**
ఆర్కోణం, Arkonam, N. A. Dt.



## ఓహో అదేమిటామాట!

సంతానం కుళ్లి కృషిస్తూ ఉంటే తల్లికి క్షోభ కాదూ?

**భారతీ-భారతాంబ తన కుష్ఠు, బొల్లి సంతానం కోసం ఎంతని విచారిస్తూఉందో?**

ఇదుగో మా 32 సంవత్సరముల అనుభవంతో ఇస్తూఉన్న అభయం

మాకు నేడే వ్రాయండి

## రెడ్డి అండ్ కో.,
గోపాలపురం. (తూ. గో. జి.)

వరుడు తన మునుపటి అభిప్రాయములను, తాత్కాలి కముగానయినా మరచిపోయి వివాహమునకు సిద్ధప డుట వింతకాదు. తనకంటే పది, పంద్రెండు సంవ త్సరములు వయస్సులో పెద్దయై, వాడు బారిన తారుణ్యకళను సూచించు ముఖరేఖతోనున్న ఆ వరుని, ఆర్థికముగ నేమి, కుటుంబ పరిస్థితుల నేమి, మెచ్చుకోదగిన పరిస్థితులు లేనివానిని, ప్రథమ దర్శనమందే ఆ రమణి వరించియుండుట గొప్ప వింత! పట్టి సాధించు విషయమున శనినిమించిన గ్రహము లేదు. వానిది మకరిపట్టు.

నక్షత్రానుకూల్యమునకై కార్తాంతికులెవరో కూటములు శోధించగా, 36 టికి ఈ వధూవరులకు 14 గుణములు వచ్చినవట! అనగా, 100 కి 39 వంతు లనుట. ఇప్పటి విద్యావిధానములో నూటికి ముప్పది అయిదు గుణములు వచ్చినచో 'ప్యాసు' కదా ?

త్వగలోనే వివాహమాడుటకై కన్యావరులు ఉత్కంఠ చూపినారు. కానీ, శని రాజ్యములో పనులు అంత త్వరితముతో జరుగుట అసంభవము. మీనరాశి ప్రత్యవాయములు కొన్ని వచ్చినవి. పద మూడు నెలలు గడచుదాక వివాహమునకు అవకాశము దొరకలేదు. కడకు, ఎవరులగ్నము నేర్పరచి ఇచ్చిరో కాని, చంద్రవరుణ సంయోగము గలదిన మున వీరికి వివాహమైనది. విప్రలంభ శృంగారము నకు తగిన ముహూర్తమది. పాపము. తరువాత, సంసారరంగమును ప్రవేశించుటకు జాతకురాలికి మరల దాదాపు సంవత్సరకాలము పట్టినది.

ఇంతలో చలిత శుక్రుడు జన్మవరుణునికి సమ సప్తకమునకు వచ్చినాడు. ఆశ యెంతో అంత నిరాశ. మనోవైషమ్యము లేర్పడి వియోగమునకు దారి తీయు దశ ఇది. చేకడి వాతప్పుట దీని ఫలము. జాత కురాలు సుఖదూర అయినది. చాలదని, చలితకుజుడు జన్మగురువుతో కేంద్రవేధకు రాగల్గుటసైత మిప్పుడే. శత్రుభావాధిపతి కుజుడు జన్మకాలమున ద్రోహ మును సూచించు తులారాశి 29 వ భాగలోనుండుట. ఇట్టి గ్రహముతో భర్తృస్థానాధిపతికి ఇప్పుడు గుప్త శత్రు దృష్టి! ఏ మూలలోనో, ద్రోహసూచనము జరు గుట కారణముగా, నిరపరాధిని యగు జాతకురాలిని భర్త నిరాదరించ నారంభించినాడు. తన్ను చేపట్టిన తరుణికి సుఖము లేదను అతని ఊహయే ఫలించినది.

గురువునకు దశమాధిపత్య మున్నదికదా ? అనగా, సప్తమస్థానమునుండి చతుర్థాధిపతి గురువే యనుట. జాతకురాలి అవస్థకు అత్తగారి కైవాటము కొంత కారణమై యుండవచ్చును. కాక, జాతకురాలితండ్రి పైన భర్తకు అసంతృప్తి కలిగి దాని ఫలము ఆమె అనుభవించుచున్నదేమో? ఆమెకు పితృస్థానాధిపతి గురువు కదా? ఇదే కారణమని తెలియదు; తన లోప మేమో తెలుసుకొన కోరినా, జాతకురాలికి చెప్పు వారు లేరు. భర్త మాటాడుటే కష్టము. అతని నాశ్రయించుటకు సౌకర్యములు లభించుట అంత కంటె కష్టము. ఆమెకు గొప్ప ఆశాభంగమది. శని ఇచ్చు శిక్షణము చాల కఠినమైనది. సుఖము నాశిం చక, ఆహార విహారాదులలో ఎన్ని కష్టములయినా ఓర్చుకొని, భర్తృ సాన్నిధ్యములో నున్నచో చాలు ననుకొన్న జాతకురాలికి ఆ మాత్రపు సౌక ర్యము సయితము శని నిరాకరించినాడు. ఘోరము!

ఓపికనుపట్టి పరీక్షించువాడు శని. మూడు నాలుగేండ్లలో చలిత రవి జన్మశనినుండి కేంద్ర వేధపాలు కానున్నాడు. చలిత రవి చంద్రుల సమాగమము వరుణుని సమసప్తక వేధా స్థానమందే జరుగనున్నది. ఇది క్లేశకాలము. ఇది గడచుదాక జాతకురాలి జీవితములో శాంతి లభిం చుట కష్టము. ఓర్పు, కార్యదీక్ష, నిష్కామ కర్మ యోగము, ఇవి అలవడినవారు తప్ప ఇతరులు శని వేధాకాలమును నెమ్మదిగా గడచి గట్టెక్కుట స్వప్నవార్త. భగవంతు డీ జాతకురాలి కష్టములు తొలగించి రక్షించుగాత.

ఈ యువతుల జాతకములను వారి భర్తల జాత కములతో పోల్చిచూచితి మేని, గుండెయు లవియగలవు. ఆ భర్తలు యోగ్యులయినా, వీరికిమాత్రము తగిన వారు కారనుటకు ఎన్నియో కారణములున్నవి. అనవసరమని, గ్రంథవిస్తరభీతిచే, భర్తల జాతకముల నిచట చూపనైతిని. చదువరులు క్షమింతురుగాక.

భావోద్రేక జనకమగు వయస్సులో అవివా హితలు గానున్న తరుణులకు దుష్టగ్రహదశ వచ్చె నేని, ఉన్నట్లుండి ప్రమాదకరమగు ప్రబలాకర్షణము నకు గురియై, క్లేశదాయకములగు వివాహబంధము లలో తగులుకొని, వారు కష్టములపాలగుచున్నారని

చూపుటకై పై నిదర్శనములు చాలును. ఇట్టి దుష్ట దశలు వివాహయోగ్యమగు వయస్సులో రానున్నపుడు, అవి కడచుదాక ఓపికపట్టి తరువాత పెండ్లియాడుట శ్రేయస్కరము. కార్యము చెడిన తరువాత దైవముమీద భారము మోపుటకంటె, ఆ దైవముపైననే భారముంచి దుష్టకాలమున శుభకార్యములు జరుపకుండుట హితము. ఆస్తికత్వమునకుగాని, ఆచారమునకుగాని, ఇది విరుద్ధము కాదు.

ప్రౌఢా వివాహములు వాడుకలోనికి వచ్చిన యీ కాలమున విద్యావతులైన కన్యలు, వారి పెద్దలుసహా, ఈ జ్యోతిశ్శాస్త్ర సూత్రములను గమనించుట తమకు మాత్రమే కాక సంఘమునకు సయితము క్షేమకారి.

"సంతుష్టో భార్యయా భర్తా,
భర్త్రా భార్యా తథైవచ,
యస్మిన్నేవ కులేనిత్యం,
కల్యాణం తత్రవైధ్రువం."

[మనువు]

---

# సందియము



శ్రీమతి సమయమంత్రి రాజ్యలక్ష్మీ అచ్చన్నపంతులు

ఇమ్మహాకాల సంద్రమ్ము నెంచియెంచి
కడపినాడవు, కల్లోల ఘర్జనముల
కళపెళంచును తాగును నిలువదయ్యె
పవలు రేలొక్క ఘోషగా పర్వులిడుచు
యుగయుగాల్ సంతరించిన వెగటులేక.

అంతతో తృప్తినొందలేదయ్య నీవు
మంత్రమో ఏదొ తంత్రమో మరేమొగాని
కోటులాదిగ ప్రాణులన్ కూర్చినావు.
ఆడుకొనిరందు నావద్దకంటివయ్య!

ఎన్నియో వేల జన్మలనెత్తినాము
ఎన్నియో రూపురేఖల నెనగినాము
ఎన్నియో పాపపుణ్యాల మన్నినాము
ఎటుల నిను చేరగల్గుటో ఎరుగలేము
నవ్వుచుందువు మముగని నటనఁజేసి.

మమ్ము సృజియించి,యిడుమల మ్రగ్గి మసలి
నిన్ను గనగోరి గనలేక వెన్నువిరిగి
విలవిలని తన్నుకొను వెర్రి వెడగులగని
నిన్ను గానటు తాటస్థ్య మీకె తగును.

కుసుమ పేశల సదృశమో కఠినవజ్ర
తుల్యమో తావక హృది దేవదేవ!
కంటి కగపడ రానట్టిదంటవోట
ఉంటివో లేక నీవు లేకుంటివో యను
సందియము లెన్నొ నామది చిందులాడు.

దేవ! ఇవియేటిలీలలు! తావకీన
క్రీడలటయివ్వి? మము దయజూడకున్న
నేడఁబోదుము, నిశ్చల నిశితదీక్ష
వీడి యొకమారు మమ్ముల జూడుమయ్య

మామకీన సందేహముల్ మగ్గఁజేసి
నిన్ను దరిఁజేరు మార్గంబు నేర్పగలుగు
దివ్యజ్ఞానాంకురాల్ మదిదీర్చకున్న
రిత్తలుగదోయి! నీ దివ్యరీతులన్ని.
విశ్వనాధ! పరంజ్యోతి! విశ్వరూప!

# సహోదరులు

### శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి

వీరాస్వామి సంధ్య చీకటి వేళ చంద్రయ్య ఇంటి తలుపు కొట్టినాడు. తెలుగు దినపత్రికను ఎడమ చేతితో పట్టుకునే కుడిచేతితో తలుపు తెరచి—వీరాస్వామిని లోపలికి రమ్మన్నాడు చంద్రయ్య.

"చంద్రయ్యా! మన ప్రయత్నాలన్నీ వ్యర్థమై పోయేట్లు కనబడుతున్నాయి. విభయిమందిని పోగు చేసుకొని—చలమయ్య ఆ ఊరు వెళ్లనే వెళ్లినాడు. మనము ఖర్చు పెట్టిన సొమ్మూ—పడిన శ్రమా వ్యర్థమైపోతాయేమో ననిపిస్తున్నది. ఏదో ఉపాయము చూసి నన్ను గట్టున పడవెయ్యి" నిలువబడే చంద్రయ్య ముఖములోకి చూస్తూ అతడి రెండు భుజాలమీదా చేతులు వేశాడు వీరాస్వామి.

"చలమయ్య ఆ ఊరు వెళ్ళాడనేనా నీ భయము? నేను ఆ చలమయ్యకంటె ముందుగా – అంతకంటె ఎక్కువమంది జనముతో - తెల్లవారక ముందే వెళ్లి - నీవు కోరినంత ప్రచారము చేసివస్తే సరికదా! భారమంతా నాపైన పెట్టి – నీవు నిశ్చింతగా ఇంటికి వెళ్లు. కాని ఒక్క మాటమాత్రము మనసులో ఉంచుకో. మనకు సహాయపడుతున్న వాళ్ళకు కొంత విరివిగా డబ్బు ఖర్చుచేయవలసి ఉంటుంది... చూసుకో...రేపు ఈవేళవరకూ...ఎంత పని జరుగుతుందో? ఆ చలమయ్యను చూస్తేనే అంత భయపడతావెందుకు? వాడు లెక్కపెట్టతగిన మనిషనా నీ అభిప్రాయము?" చంద్రయ్య తనతోపాటు వీరాస్వామిని కూడా మంచముమీద కూర్చోబెట్టుకొని – "ఏం వీరాస్వామీ! నా మాటమీద నీకు నమ్మకము కుదరటము లేదా?" అన్నాడు.

"లేకేం? చాలా ఉన్నది. ఆ చలమయ్య తగనివాడు. అతడివాక్కు ఎటువంటిదోగాని...ఒక్క మాటతో అందరూ అతడికి లోబడిపోతారు. చిల్లిపైస చేతిలో లేకుండానే ప్రచారము సాగించుకొని వస్తున్నాడు. ఆ జిల్లా ప్రాంతము అతడి మాటమీద నడుస్తుందని అందరూ అనుకుంటున్నారు." అని ఒక్కసారి దీర్ఘముగా ఊపిరి తీసుకొని విడిచాడు వీరాస్వామి.

"ఇదుగో స్వామీ! నీవు ఇప్పటినుంచీ ఊరికే దిగులుపడుతూ కూర్చోకు. జయాపజయాలు మొదలుపెట్టిన దగ్గరనుండే లెక్కచూసుకుంటూ దిగులు పడకు. నేను ఆ చలమయ్య అంతు కనుక్కొనిదీ ఈసారి విడిచిపెట్టను. నీకు చేసిన వాగ్దానము ఏమాత్రము మరువను. ఆ భారమంతా నామీద ఉంచి నీవు నిశ్చింతగా ఉండు."

మంచము మీదినుండి ఇద్దరూ లేచి వాకిటి ముందుకు వచ్చి నిలువబడ్డారు. వీరాస్వామి పదినూరు రూపాయల నోట్లను రెండుసార్లు లెక్కపెట్టి చంద్రయ్యపర్సుజేబులో పెట్టి—అతడి ముఖమువంక చూశాడు.

"రేపు పని పూర్తి చేసుకొని నాదగ్గరికిరా ఇప్పుడిచ్చినవి రేపటి ఖర్చుకే లే" చంద్రయ్యముఖము చూస్తూ—మనసులో ఆలోచించుకుంటూ వీరాస్వామి వెళ్లిపోయినాడు.

ఆ జిల్లాలో మోతుబరిరైతు అయిన చలమయ్య—శాసనసభకు రంగయ్యను అభ్యర్థిగా నిలువబెట్టవలెనని తీవ్రముగా కృషిచేస్తున్నాడు. ప్రజలను సమావేశపరచి ప్రచారము చేస్తున్నాడు. ఆజిల్లా ప్రజలకు మొదటినుండీ చలమయ్యమీద అపరిమితమైన భక్తిగౌరవాలు ఉన్నాయి. ప్రజల కాతడు వరము లిచ్చే దేవతగా కనబడుతున్నాడు.

స్వతంత్రముగా ఆజిల్లాకు అభ్యర్థిగా నిలువబడదలచుకొన్న వీరాస్వామికి—చలమయ్య చేస్తూఉన్న ప్రచారమువల్ల కలవరపాటు హెచ్చినది.

'రంగయ్య తెలివికి శాసనసభా సభ్యత్వము

తక్కువైనది కాబోలు! నిజంగా శత్రువుడు కావటమే తటస్థించినట్లయితే—వాడిని పట్టపగ్గాలు ఉంటాయా? రంగయ్య! వట్టి పనికిమాలినవాడు! వాడి చదువెంత—వాడి రాజకీయపరిజ్ఞాన మెంత? నలుగురిలో నిలుచబడి నాలుగుమాటలైనా మాట్లాడ లేడు! అప్పు డెప్పుడో దోచిన ధనముతో—ఇప్పుడు ప్రచారము చేసుకొని—ఎన్నికలలో నిలువ బడుతున్నాడు. ఒకవేళ—గెలవటమే నిజమైతే—పట్టపగలే దారులు దోయించడూ?...వీడిని గెలువ నిస్తే...నేను కోటయ్య కొడుకు నేకాదు!' అను కున్నాడు వీరాస్వామి. తెల్లవార్లూ కంటికి నిద్ర లేకుండా యోచించసాగినాడు. తెలతెలవారు తుండగా చిన్నకునుకు పట్టినది. ఆ పట్టే పట్టని నిద్రలో వీరాస్వామి కంటికి చంద్రయ్య ప్రత్యక్షు మైనాడు. మెలికలు తిరిగిన వెంట్రుకలతల. స్వదేశీ వస్త్రధారణమూ—పట్నవాసపు పాపోసులూ—చేతిలో కర్ర. ముఖము పైకెత్తిమాస్తేనేగాని చూపందని విగ్రహము—ముఖముమీద చిరునవ్వు. టకటక తలుపుకొట్టి 'స్వామీ! అన్నిటికీ నేనున్నానుగా!' అని చంద్రయ్య చెప్పినట్లనిపించింది వీరాస్వామికి.

చంద్రయ్య! పదిమంది గ్రామస్థులకు జవాబు చెప్పగల దేహదారుఢ్యము కలవాడు. మాటలతో ప్రజల నాకర్షించగలిగినవాడు. అదిగాక—ఆ జిల్లా మొత్తముమీద చలమయ్య పేరు వినగానే అసహ్యించుకొని పళ్లుకొరికేవాడు ఒక్క చంద్రయ్యే! ఇతడే తన కన్ని విధములా అనుకూలమైన వ్యక్తి అని వీరాస్వామి భావించుకున్నాడు.

* * * *

అది నవభారతములో ప్రజాప్రభుత్వపు ప్రథమ ఎన్నికల సంరంభకాలము. అత్యుత్సాహముతో ప్రజలు కేరింతలు కొట్ట నారంభించినారు. ఏభయి సంవత్సరాల శాంతి సమరము తరువాత—నేడు సంపూర్ణస్వాతంత్ర్యము. ప్రజాస్వామ్యము!

తెలిసినవారికీ తెలియనివారికీ ఒకటే సందడి. ఎన్నికలసందడి! ప్రతి గ్రామములోనూ ఎన్నికల ప్రచారము అఖండముగా సాగిపోతున్నది. జీపుకార్లూ—పెద్దకార్లూ—లౌడ్ స్పీకర్ల నలంకరించుకొని—ప్రచారకులతో తిరుగ నారంభించినవి.

'కడుపునిండా అన్నమూ—ఒంటినిండా బట్టా మీకు దొరకవలెనంటే మన జిల్లాలోకి సమర్థుడైన రంగయ్యకే మీఓటు ఇవ్వండి' అని కేకలు వేస్తూ ఏభయి మంది జనము కాగితాలను పంచుతూ వీధులవెంబడి బయలుదేరినారు. ఆ గ్రామములోని పిల్లలు వారిని వెంబడించినారు. ఊరిబైట రచ్చబండ దగ్గర పెద్ద సమావేశము జరిగినది. రంగయ్య ప్రతిభాసామర్థ్యములను గురించి సుమారు ఒకగంటసేపు ఒకరు ఉపన్యసించినారు. గ్రామస్థులకు రంగయ్య పేరు బాగా మనసున పట్టినది.

ఆ గుంపు ఆదినము అక్కడినుండి బయలుదేరి మరునాటికి మరొకగ్రామములో ప్రచారము చేయటానికి ఏర్పాటుచేసుకున్నది.

ఆ మరునాడు ఆ గ్రామములోకి మరొకగుంపు బయలుదేరివచ్చింది. 'బీదజనులకు న్యాయముజరుగవలెనంటే—బీదలు మానవులుగా భావింపబడవలెనంటే—దీనదయాళుడైన వీరాస్వామికే మీ ఓటు నివ్వండి. దాంభికులను నమ్మకోకండి!'

జనసమూహము ముందుకుసాగిపోతున్న కొలదీ-ఆ నినాదాలు ప్రజల హృదయాలలో నాట్యము చేయసాగినవి. 'ప్రతిమనిషికి కడుపులోకి అన్నమూ, ఒంటికి బట్టా ఏర్పాటు చేయకలిగినవాడికే మా ఓటు' అని నిశ్చయించుకొన్న ప్రజలకు-రెండవసారి జరిగిన ప్రచారముతో ప్రథమంలో కలిగిన అభిప్రాయము మారిపోయినది. బీదలను కష్టాలను తొలగించి—బీదలను కూడా మానవులుగా భావించే మహానుభావు డున్నట్లయితే తమ ఓటును ఖండితముగా ఆయనకే ఇవ్వవలెనని ప్రజలు నిశ్చయించుకున్నారు.

మూడవనాడు ఆ గ్రామవీధులలో మరొక సమూహము తిరిగినది.

ఆ సాయంత్రము మరొకటి సంచారము చేసినది. తాము అంతకు పూర్వము చేసిన ఘనకార్యములను విపులీకరిస్తూ కొన్ని జీపుకార్లు గ్రామ సంచారము చేసినవి.

ఆ గ్రామములోని ప్రజల ఓట్లకు వారసులనేకులైనారు. ఒక్కొక్క సంస్థ ప్రచారము చేసుకొని—ఓట్లను ఖాయపరచుకొని-సాగిపోయినది.

భుజబలముగల ఏభయిమంది జనముతో

చంద్రయ్య బయలుదేరి గ్రామగ్రామమూ సంచారము సాగించినాడు.

మార్గశిరమాసపు చలి మానవులను గడగడ వణకించి వేస్తున్నది. పుచ్చపువ్వులాగ వెన్నెల విరియకాస్తూ ఉండగా చంద్రయ్య వెంబడి బయలుదేరిన జనము పిలపదాలు పాడుకుంటూ నడుస్తున్నారు. ఇంకా కోసెడు దూరము నడిస్తేనే గాని గమ్యస్థానము చేరుకోవరు. త్వరపడి-చలమయ్యకంటె ఆ గ్రామము చేరుకొని ప్రచారము చేసుకోవాలి.

పొడుగుపాటి కర్రలను చేతపట్టుకొని నలుగురు మనుష్యులు ముందు నడుస్తున్నారు. చంద్రయ్య లంకపొగాకుచుట్టను వెలిగించి గుప్పుగుప్పున పొగ విడుస్తూ - తల వంచుకొని ఆలోచించుతూ - నడుస్తున్నాడు. తక్కినవారంతా ముందుగా వెళ్లినవారిని అనుసరించుతున్నారు.

గ్రామము కనుచూపుమేర వరకూ వచ్చినది. పొలిమేర సమీపములో — ఒక పాకలోనుండి జన సందడి చంద్రయ్యకు వినవచ్చినది.

ఆ సందడి చలమయ్య పార్టీది కాదుగద!

చంద్రయ్య మనసు ఉద్రేకించినది. చలమయ్య కంటె ముందుగా గ్రామము ప్రవేశించవలెనని అతడి ల్పము. ఆ చలమయ్య అదేమి మనిషో - జనాన్ని తలకాలమీద కూడగట్టుకొని — తనచేతిక్రింద పెట్టుకుంటాడు! ఎక్కువగా పైకైనా ఖర్చుచేయడు!

చంద్రయ్య రక్తము ఉడుకెక్కినది. జేబులోని పైకము గలగలలాడినది. వెంటనే తలమీది ముసుగు తీసి — చంద్రయ్య తన జట్టువారి కందరికీ చేతిసైగ చేసినాడు.

అందరూ ఒక్కపరుగున పాకమీద పడినారు.

* * * *

ఎన్నికలు జరిగేవరకూ చంద్రయ్య ఊళ్లమీద తిరుగుతూనే ఉన్నాడు. ఎన్నికల బాబతు పైకము అతడిసంచిలో ఏమాత్రమో నిలచి—అతడిని కలకత్తా పట్టణమువరకూ లాగుకొని పోయినది.

క్రొత్తగా పట్టణపు విశేషాలనూ వింతలనూ చూచి ఆనందిస్తున్న చంద్రయ్య—తిరిగి గ్రామము చేరుకోవటానికి కావలసిన పైకముమాత్రము అట్టి పెట్టుకొని - మిగిలినదంతా ఖర్చుచేయ నారంభించాడు. అతడికా సంబరములో ఎన్ని దినాలు గడచినవో గమనికే లేదు.

ఒకనాటి ఉదయము హోటలులో కాఫీ త్రాగుతుండగా తెలుగు పత్రికలో ఎన్నికల ఫలితాలు పెద్దక్షరాలలో కానవచ్చినవి.

ఓట్లు ఎక్కువ సంఖ్యలో సంపాదించుకొని— ఎన్నుకొనబడిన వ్యక్తి చంద్రయ్య పార్టీకాదు—చలమయ్యది అంతకంటె కాదు—మూడవపార్టీ వ్యక్తి!

చంద్రయ్య మనసు ఒక విధముగా సమాధానము పొందినది. తాను నిలువబెట్టదలచిన వ్యక్తి ఓడిపోయినా చలమయ్యపార్టీ మనిషిమాత్రం గెలువలేదని!

* * * *

చంద్రయ్య ఇంటికివచ్చి విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఈసంగతి వీరాస్వామికి తెలిసి చూడటానికి వచ్చాడు.

"నేను రెండుసార్లు మీయింటికి వచ్చాను అయ్యా. నీవు ఊళ్లోలేవా ఏం—కనబడలేదు" అన్నాడు వీరాస్వామి.

"ఆ గోలలలో తిరిగిన తిరుగుడుకు శరీరము చాలా అలసిపోయినది. గాలిమార్చితే బాగుంటుందేమోనని బయలుదేరి వెళ్లాను" తలవంచుకొని అన్నాడు.

వీరాస్వామికి చంద్రయ్యతో ఏమి మాట్లాడవలెనో తోచలేదు. 'అట్లాగా! ఇప్పుడు ఆరోగ్యము బాగున్నదికదా!' ఈ మాట మాత్రము నిర్వికారముగా అనగలిగాడు.

అయిదునిమిషాలపాటు ఇద్దరిమధ్య నిశ్శబ్దము భరించరానిదిగా తయారుఅయింది. చివరకు చంద్రయ్య 'చూస్తున్నావుగా వీరాస్వామీ! న్యాయముగా గెలవటము చాలా కష్టమైన పని' అన్నాడు ఇంటికప్పును చూస్తూ.

"అవును. ఓడిపోయినాను గనుక న్యాయము నావైపే ఉన్నదనుకోవాలి." తల ఆడిస్తూ వీరాస్వామి గడపదాటి వెళ్లిపోయినాడు.

చంద్రయ్య మాట్లాడకుండా భోజనముచేసి పడుకున్నాడు.

రాత్రి పన్నెండుగంటలవేళ చంద్రయ్యకు నిద్రలో మెలకువ వచ్చింది. నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ ఎక్కడినుండో ఎవరో మూలిగిన శబ్దము చంద్రయ్యకు వినబడ్డది.

మొదటిసారి రెండవసారి పరాకుగా విన్నాడు.

మూడవసారి నాలుగవసారి బాగా స్ఫుటముగా వినబడ్డది.

మనసు పెట్టి విన్నకొలదీ సమీపమునుండే వినవస్తున్నట్లుగా చంద్రయ్యకు తోచింది. భార్యను లేపి అడిగినాడు.

"మొన్నటి ఎలక్షను గడబిడలో బావగారికి బలమైన దెబ్బలు తగిలాయట. తలమీద పెద్దగాయమైనదట. కాలి ఎముక విరిగినదనుకుంటున్నారు. నిలబడ లేరట. చాల బాధపడుతున్నారట" కండ్లు నులుపుకుంటూ జంకుతూ చెప్పింది భార్య.

'నీకెవరు చెప్పారు?' అన్నాడు ఆశ్చర్యముతో.

'బావగారి రాముచెప్పాడని మన పని మనిషి అన్నది. వాళ్ళమ్మ నిద్రాహారాలు లేకుండా ఏడుస్తున్న'దని చెప్పాడట!

అంతలో 'అబ్బా! అని బాధతో గ్గీ మూలిగిన శబ్దము తిరిగి వినపడ్డది.

చంద్రయ్య బలవంతముగా నిద్రపోవటానికి ప్రయత్నించాడు. మూలుగు చెవినపడినప్పుడెల్లా దేహము జలదరించి మనసు కలతపడ నారంభించింది.

ఆశబ్దానికీ ఈహృదయానికీ ఏమి సంబంధమో- ఆ మూలుగునకు చంద్రయ్య హృదయములోని నరాలు తోడుపలుక నారంభించినవి.

రెండు చేతులతో తలపట్టుకొని చంద్రయ్యచోరగిల పడుకున్నాడు.

ఈసమయములో తనతల్లే ఉన్నట్లయితే ఆమె హృదయమెంత తరుగుకొని పోయెదో! చలపయ్యనూ చంద్రయ్యనూ గన్నతల్లి శంకరమ్మ ఇద్దరిని చెరి ఒక కన్ను అనుకొనేది. కుమారద్వయము జన్మించిన నెలకే తండ్రి హృద్రోగముతో అకస్మాత్తుగా చనిపోయినాడు. అయింటా—అయింటాపనిచేసి—వంటలుచేసి బిడ్డలను పెంచుకొన్నది ఆతల్లి. ఆమె నోటి మంచితనమువల్ల బిడ్డలకు రెండు ఆతురపు ముక్కలు అంటి జీవనోపాధులు కలిగినవి.

బాల్యములో అన్నదమ్ములిద్దరికీ - ఇతరులకు అసూయను పుట్టించేంత వాత్సల్యము ఒకరిపైన ఒకరికి ఉండేది. పాతికేళ్ళ కిందటకూడా - తమ్మునికి జ్వరము రాగానే - ఆతుర్దాతో రెండు మైళ్ళ దూరము నడిచివెళ్ళి అన్న మందు తెచ్చియిచ్చేవాడు. అన్న పథ్యములోకి కావలసిన ఆవుపాలు పొరుగూరినుండి - సూర్యోదయానికి పూర్వమే తమ్ముడు తెచ్చియిచ్చేవాడు. తనకు లభ్యమైన చిరుతిండిని చేతబట్టుకొని అన్న వచ్చేవరకూ ఎదురు చూస్తూ తమ్ముడు వాకిట్లో నిలువబడేవాడు. తమ్మునితో పంచుకొననిదే అన్నకు ఏ వస్తువూ సహించేది కాదు. వాళ్ల హృదయాలు పరస్పరమూ మారుమ్రోగుతూ ఉండేవి.

యౌవనము పొడచూపి వ్యక్తిగతజీవితములారంభమయే వరకూ ఏ మార్పూ ఉన్నట్లు కనబడలేదు. ఒకనాడు చంద్రయ్య సామానులకొరకు బజారుకు వెళ్ళాడు. బేరము కాగానే - సెట్టి "బేరములో అన్నయ్యగారిని మించిపోతున్నారే!" అన్నాడు.

"అంటే?"

"అంటే ఏం లేదులెండి. అన్నయ్యగారిది అదొకమాదిరి మనసు" అన్నాడు సెట్టి.

ఇంటికి వస్తూనే చంద్రయ్య తల్లిని భోజనము పెట్టమన్నాడు. "నాయనా! వంట సాంతమయిన తరువాత భోజనము చేతువు గాని. అన్నయ్య కూడా తొందరపడుతున్నాడు. పావుగంట తాళితే అయిపోతుంది" అన్నది.

మాట్లాడకుండా చంద్రయ్య వెళ్ళి గదిలో పడుకున్నాడు. అన్నగారి గదిలోనుంచి కిలకిలనవ్వులు వినబడుతున్నాయి. రెండేళ్ళ పిల్లవాడు వచ్చీరాని మాటలలో తండ్రితో దాగుడుమూత లాడుతున్నాడు.

చంద్రయ్య కానాడు మనసు స్వాధీనములో లేదు. కారణమేమో అతడి ఊహ కందలేదు. బాలుడి కేరింతలు ఒకప్పుడు అతనికి ఆనందాన్ని కలిగించిన వేగాని యిప్పుడు చిరాకుపరచాయి. అంతలో తల్లి భోజనానికి పిలిచింది— "అన్నయ్య పీటమీద కూర్చున్నాడు. నీవుకూడా రా నాయనా!" అని.

చంద్రయ్య అన్యమనస్కుడై మెల్లగా లేచి పీటమీద కూర్చున్నాడు. చంద్రయ్య భార్య నెయ్యి వడ్డిస్తున్నది. గిన్నె పట్టుకొని చంద్రయ్యదగ్గర ఒక నిమిషమునేపు నిలువబడ్డది. అతడు పరధ్యానములో ఉండగా చూసి బావగారికి నెయ్యి వడ్డించివచ్చి మళ్ళీ నిలువబడ్డది. చంద్రయ్యకు నెయ్యి వేయించుకొన బుద్ధి పుట్టలేదు.

అప్పటికి నాలుగేళ్ళక్రింద పొరుగూరినుండి- రామయ్య తనకూతురిని ఈయింటికి యివ్వవలెనని

అడుగుదామని వచ్చాడు. తల్లి రెండవపిల్లవాడికి—వచ్చే సంవత్సరము ఆ పిల్లను చేసుకొంటానని చెప్పింది. అతడు వినక వచ్చే సంవత్సరమైనా పెద్ద పిల్లవాడికిగాని యివ్వనన్నాడు. తల్లి కాదనలేక పోయినది. నిజానికి ఆ పిల్లదగ్గరికి వరుడు హీనంగా కనబడుతాడు.

చంద్రయ్యకు ఆ విషయము తలవని తలంపుగా అప్పుడు జ్ఞాపకము వచ్చింది. ఆ రామయ్యకు ఇద్దరన్నదమ్ములలో కనబడ్డ వ్యత్యాసమేమిటి? తాను తరువాత ఎకరపు పల్లపుభూమి కట్నము తీసుకొని చక్కని పిల్లనే పెళ్ళిచేసుకున్నాడు—కాని ఆ విషయము మాత్రము మరపుకు రావటములేదు.

లోతుగా ఆలోచించినా ఆ సంఘటనలలో ఒక్కటైనా పెద్దకారణ మనిపించుకోదు కాని—ఇవన్నీ అతడి మనసులో ఒకమూల కాపురము చేస్తూనే ఉన్నాయి—ఇప్పటికీ.

మధ్యాహ్నము నిద్రపోయి లేచేసరికి భార్య గదిలోకివచ్చి — కాఫీ గ్లాసు చేతికందించింది. 'చక్కెర చాలలేదన్నా'డు, ఆమె అమాయికముగా — 'ఎవరూ తక్కువైనదని అనలేదే!' అన్నది. వెంటనే 'అన్నయ్యైనా అననిది?' అన్నాడు.

మరునాటినుంచీ అన్నగారి పిల్లవాడిని ఎత్తుకొని ముద్దులాడుతున్న తన భార్యను—అకారణముగా కోప్పడి—పిల్లవాడిని వదలిపెట్టిరమ్మని అనబుద్ధిపుట్టింది అతనికి.

మనసులో బయలుదేరుతున్న ఆ విప్లవమేమిటో దాని నామరూపాలేమిటో అతడికి తెలియలేదు కాని—ఆనాటినుండీ అతడి మనసులో ఒక భావము సంచారముచేయ నారంభించినది. సాంసారికముగా—సాంఘికముగా తమ యిద్దరికీగల వ్యత్యాసమూ—తారతమ్యమూ బాగా ప్రచారానికి వచ్చినాయి కదా? ఆ భేదసాదృశ్యాలు ఏవేవి? దాని జవాబు ననుసరించుకొని మరొక ప్రశ్న ఉదయించింది—'అయితే ఏది ఎక్కువ?' అని. స్వాభిమానము నిర్ణయానికి రానివ్వలేదు.

తల్లిపోయిన తరువాత—చంద్రయ్యకు ఏడాది బిడ్డ చనిపోయింది. ఆ ఊరిలో ఎరిగినవాళ్ళంతా ఆడా—మొగా—వచ్చి దంపతులను పలకరించి—సానుభూతి వాక్యాలు పలికి వెళ్ళారు. అన్న చలమయ్య మాత్రము నోటితో తమ్ముడినేమీ పలకరించలేదు కాని—అతడి ఒడిలోనే ఆ బిడ్డ కన్నుమూసింది. చలమయ్యే ఆ బిడ్డను తీసుకొని వెళ్ళాడు. పదిరోజులపాటు తమ్ముడి మంచముదగ్గర మంచము వేసుకొని పడుకొన్నాడు. తమ్ముడిని తన పంక్తికి భోజనానికి కూర్చుండబెట్టుకొని తమ్ముడు నోట్లో ముద్దపెట్టుకొన్న తరువాతనే తాను మెతుకు కొరికేవాడు. అప్పుడు ఇతరుల సానుభూతి వాక్యాలతో తాను అన్న సానుభూతిని పోల్చిచూసుకున్నాడు. అన్న నోటవెంట మాటే రాలేదు.

ఆతరువాతనే ఆ యింటిని రెండు భాగాలుగా పంచుకొని మధ్య తలుపులను బంధించుకొన్నారు. క్రమాగతముగా ఒకరిని చూడగానే మరొకరు ముఖము త్రిప్పుకోవటము కుటుంబములోని శుభాశుభ కార్యములలో ఒకరినొకరు పలుకరించుకోనకుండా ఉండటము జరుగుతూ వచ్చినది. బిడ్డలు మాత్రము ఇంటి ఆవరణములో తప్ప బయట మాట్లాడుకోవటము నిలుపుకొన్నారు.

"అబ్బా! తలపోటు!"

తిరిగి మూలుగు వినపడ్డది.

మంచముమీద పడుకొని సోదరునకూ తనకూగల గుణభేదాలను గురించి ఆలోచిస్తున్న చంద్రయ్య మూలుగును విన్న తరువాత మంచముమీద లేచి కూర్చున్నాడు.

గోడగడియారము ఖంగు ఖంగున రెండుగంటలు కొట్టింది.

"అమ్మా! ఉ!"

చంద్రయ్య దిగ్గున లేచి నిలువబడి—రెండునిమిషాలపాటు యోచించి—దక్షిణపు దిశన బంధించి ఉన్న తలుపును తెరువ ప్రయత్నించినాడు. ఆ తలుపులను బంధించి ఎనిమిది సంవత్సరాలకు పైగా కావటము వలన—గొడ్డలి సహాయముతో గాని గడియపైకి లేచినది కాదు.

కరదీపిక చేత పట్టుకొని—సావడిలోనుండి—చంద్రయ్య గదిలోకి వెళ్ళి నిలువబడినాడు.

ఒక మూల సన్నగా దీపము వెలుగుతున్నది. మంచముమీద అన్న పండుకొని మూలుగుతున్నాడు. తలకూ కాలికీ కట్లుకట్టి ఉన్నాయి. వదినెగారు రోగికి విసరుతూ దగ్గరకూర్చున్నది.

చంద్రయ్య చేతిలో వున్న కరదీపిక చేయి జారి నేలమీద పడ్డది. అన్నను ప్రత్యక్షముగా చూసిన తమ్ముడు "చలమన్నయ్యా!" అంటూ మంచముమీద ఉన్న రోగిపైన బడి—తన హృదయానికి అతడిని అదుముకున్నాడు.

"తలబాధగా చంద్రీ! తలబాధరా!" తమ్ముని తన బాహువులతో బంధించుకొన్నాడు చలమయ్య.

అన్నదమ్ముల కౌగిలింతను గాంచిన తోటికోడళ్ళ హృదయాలలో 'ఎంతయినా వాళ్ళు ఒక తల్లిపిల్లలు!' అన్న భావము మెరపులాగ మెరసింది.



లేపాక్షి దేవాలయములో నాట్యమంటపములోఁగల స్త్రీ ముఖశిల్పము.

# చారిత్రకశతకములు-
# భద్రగిరిశతకము



శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

తెనుగు శతకవాఙ్మయ మతివిస్తృతమయినది. తెనుగు శతకములలో శృంగార రసాత్మకములు, భక్తిరసభరితములు, నీతిజ్ఞాన వైరాగ్యబోధకములు, రాజనీత్యుపదేశకములు మొదలైన వెన్ని రకములో యున్నవి. ఇవికాక రామాయణ, భాగవత కథలను దెలుపునవి కొన్ని; విద్యాసంస్కారవాసనా విరహితులైన గ్రామీణుల యమాయక వృత్తమును వర్ణించి నవ్వు పుట్టించునవి కొన్ని; బలాధికార గర్వాంధకారప్రమత్తులై ప్రజలను హింసించు రాజుల, దురాశాపరులై సామాన్యజనులను పీడించుకొని తిను దుష్టాధికారుల దుర్వర్తనమును నిరసించి నిందించు నధిక్షేపణాత్మకములు హేళనపరాయణములునైన శతకములు కొన్ని; కేవలము తత్త్వబోధ చేయునవి కొన్ని—ఇట్లు శతకములలోగలవిషయమును పురస్కరించుకొని రకముల నెంచుకొనుచు బోయినచో తెనుగు శతకవాఙ్మయమున నెన్ని రకములైన దేలును.

పై నుడివిన రకములు మాత్రమేకాక చరిత్ర కుపకరించునట్టి, చారిత్రక సంఘటనలు జరిగినపుడు కవులు రచియించినట్టి శతకములు కొన్నియున్నవి. ఇట్టివానిలో 'శత్రుసంహార వేంకటాచల విహార', 'రాక్షసవిరామ కస్తూరి రంగధామ', 'వైరిహరరంహ సింహాద్రి నారసింహ', వంటి మకుటములుగల శతకములు ముఖ్యమైనవి. ఇవి యన్నియు ముస్లిములు మన దేశములోని ఏదో యొక ప్రాంతముపై దండెత్తివచ్చి గ్రామములను దోచుకొని ప్రజలను హింసించుటతో తృప్తిచెందక యచ్చటి దేవాలయములను, అందలి విగ్రహములను నాశనము చేసినప్పు డచ్చటి దేవుని పేర జెప్పబడిన శతకములు. ఆస్వామిని రక్షింపుమని వేడుకొనుచు, రక్షింపడయ్యెనని నిందించుచు దమ యార్తిని వెలిబుచ్చుచు కవులు ఆ యాపత్కాలమున జెప్పిన శతకము లివి. మచ్చుకు చూడుడు గోగులపాటి కూర్మనాథకవి విరచించిన సింహాద్రి నారసింహ శతకములోని యీ క్రింది పద్యము :

"మున్ను తాటక ప్రాణముల్ గొన్న బాణంబు
  మెఱసి సుబాహు దున్మిన విశిఖము
మించి విరాధు ఖండించిన ప్రదరంబు
  ఖరదూషణాది సంహరణశరము
మాయల మారీచు మద మణంచిన తూపు
  ఘోరకబంధుని గూల్చు సిలుగు
వాలిని బలశాలి గూలనేసినకోల
  జలధి నింకించిన సాయకంబు
రావణాది మహాసురరాజి నణచు
చండకాండంబు లేమాయె చటుల యవన
ఖండనముసేయ నయ్యంబకముల బరపు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!"

ఇట్టిదే వేంకటాచల విహార శతకములోని యీ క్రింది పద్యము నవలోకింపుడు :

వడిగుళ్లు సొచ్చి దేవళ్ళ బ్రద్దలుచేసి
  ఘట్టించి లేజీల గట్టునపుడు
జిగురుపాలకటంచు జిగిరించు రావిమ్రా
  కులు నజ్జు నజ్జుగా గొట్టునపుడు
గురు సార్వభౌముల గోడుపోసుక పట్టె
  నామముల్ మొదలంట నాకునపుడు

గద్దించి వెస వైదిక బాపనయ్యల
పిల్లజుట్లూడంగ బెఱుకునపుడు
సెక్కుమా నీకు తురకల జక్కు సేయ
విన్నవించితి నా వెట్టి విన్నపంబు
పరగ మీ చిత్తమిడ నాదు భాగ్యమూర
శత్రుసంహార ! వేంకటాచల విహార !

కవు లుద్రిక్త హృదయులై దేవుని తమ్ము రక్షింపుమని వేడుకొనుచు బ్రతిమాలుకొనుచు, రక్షణలేక పోయినప్పుడు తురకల విజృంభణము యథారీతిగ సాగుచున్నప్పుడు ఓపిక చెడి స్వామిసామర్థ్యమును గేలిసేయుచు పరిపరివిధముల స్వామిని దూఱుచు రచియించిన శతకము లివి. ఈ శతకములు ఆనాటి ప్రజలుపొందిన సంక్షోభమును బాధలను కడగండ్లను అద్దములోవలె ప్రతిఫలింపజేయును. తురకల దండయాత్రల సందర్భమున ఆంధ్రప్రజానీకము పొందిన దుర్భరమైన యార్తి రూపు గైకొన్న మూర్తులీ శతకరాజములు. విపత్తు తొలగిపోయినవెనుక కవి తాను చేసిన దూషణమునకు తన్ను క్షమించి రక్షించవలసినదని పరిపరివిధముల వేడుకొనును. వ్యాజస్తుతి, వ్యాజనిందాదులతోగూడిన యిట్టిశతకములు చారిత్రక విశేషములను దెలుపకపోయినను చారిత్రక సంఘటనలు కారణముగ బుట్టినవగుటచేత వీటిని చారిత్రక శతకములుగ పరిగణింపవచ్చును. ఇటువంటి చారిత్రక శతకములు తెలుగు శతకవాఙ్మయమున చాల పరిమితముగా నున్నవి. ఈ శతకము లన్నిటిని గురించి వ్రాయవలసియే యున్నను ఈ వ్యాసమును వ్రాయసంకల్పించిన దందులకు కాదు. ఇటువంటి చారిత్రక శతకములలో తెనుగు పాఠకుల కంత యెక్కువగ దెలియనిదియు, తెనుగుదేశమున నంతగ ప్రచారములో లేనిదియు నైన భద్రగిరిశతకమును గుఱించి యొలుకపలుచుటయే నా యుద్దేశము.

## 2

భద్రగిరి శతకమును శ్రీ వావిళ్ళవారును, ఆంధ్ర సాహిత్య పరిషత్తువారును గూడ ముద్రించి ప్రకటించినారు. ఇంక నితరు లెవ్వరైన ప్రకటించిరేమో నాకు తెలియదు. ఇది పేరయ కవికృతము. ఇతని యింటిపేరు భల్లావారని గలదు. ఈ శతకమును ప్రకటించిన ఆంధ్ర సాహిత్య పరిషత్తువారును, శ్రీ వావిళ్ళ వారును గూడ భల్లా పేరయయనియే ప్రకటించినారు. భల్లావారన్నదే సరియైన యింటి పేరేమో. చల్లావారున్నారు; భల్లా వారు కూడ నున్నారేమో తెలియదు.

ఇదివఱలో నుడివినట్లు ఈశతకమును కవి తురకలు భద్రాచలప్రాంతముమీదికి దండెత్తి వచ్చి ప్రజలను హింసలపాలుచేసి గ్రామములను దోచుకొని దేవాలయములను పాడొనరించి యందలి విగ్రహములను విధ్వంసము కావించుచుండిన సందర్భమున వ్రాసినాడు. ఆ కాలములో ఇటువంటి యుపద్రవము లంతకు పూర్వము సంభవించినపుడు శ్రీరంగమునుండి శ్రీరంగనాథుడును, జగన్నాథము నుండి నీలాద్రివాసుడును స్థలాంతరములకు వలస వెళ్లినట్లుగా భద్రాద్రివాసుడైన శ్రీరామచంద్రమూర్తి కూడ భద్రగిరిని విడిచి పడమటి గోదావరి జిల్లా పోలవరమునకు వలసవెళ్లి యచ్చట నయిదు సంవత్సరము లుండెను. ఇంతలో దుర్మార్గుల యుపద్రవ మంతరించి భద్రాచలమున శాంతి నెలకొనుటచేత అయిదు సంవత్సరముల ప్రవాసానంతరమున శ్రీరామచంద్రమూర్తి మఱల దన స్వస్థలమునకు జేరుకొనెను.

భద్రగిరివాసు డే కారణమున నెప్పుడు భద్రాచలమును వదలి పోలవరమున కరిగెనో, తిరుగ భద్రాద్రి కెప్పుడు వచ్చెనో యీ క్రింది పద్య మిట్లు తెలుపుచున్నది.

"సర్వధారను పేరి సంవత్సరమునందు
ధంసాకు పఱచి యుద్దరికి వచ్చి
పోలవరంబులో బోలుపొంద నైదేండ్లు
వనవాస మొనరించి వరుసతోడ
శాక్తేయ మతయుతు సంహార మొనరించి
మంత్రాంగశక్తి యుక్కుమీని వెలయ
దగ బూసపాటి సీతారామరాజు వి
జయరామరాజుల సరసముగను(?)
విజయ సంవత్సరంబున విజయముగను
భద్రగిరి కేగి తానయ్యె భద్రముగను
భద్రగిరివాస ! శ్రీరామభద్ర ! దాస
పోష బిరుదాంక ; రఘుకులాంబుధి శశాంక !

